# సంఘంచేసిన భిక్షుకి

## నాటిక

రచన

డా॥ వాసా ప్రభావతి. ఎం. ఎ. పి. హెచ్. డి

లెక్చరర్

సరోజినీ నాయుడు వనితా మహా విద్యాలయ

ఎగ్జిబిషన్ గ్రౌండ్సు

హైదరాబాదు.

**వాసా ప్రచురణలు.**

మలక్‌పేట, హైదరాబాదు.

# SAMGHAM CHECINA BHIKSHUK

*By*

**Dr. VASA PRABHAVATHI**

ప్రథమ ముద్రణ. ఏప్రిల్ 1985
ప్రతులు 1000
వెల: రూ. 5/-

ముఖపత్ర చిత్రం:
శీలా వీర్రాజు

కవరు పేజీ పుస్తక ముద్రణ-
స్నేహలతా ప్రింటర్స్,
బరకత్‌పురా, హైదరాబాద్

ప్రతులకు.
1) వాసా ప్రచురణలు.
వాసానిలయం.
11/2. R. T. మ్యునిసిపల్ కాలనీ.
మలక్‌పేట.
హైదరాబాదు. 500036

2) నవయుగ బుక్‌హౌస్
సుల్తాన్ బజారు, హైదరాబాదు.

# కానుక

జానపద సాహితీ సాగరాన్ని మథించి
ఆ అమృతాన్ని సాహితీలోకానికి పంచిపెడుతూ
ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగుశాఖకు
ప్రథమ మహిళా అధ్యక్షురాలిగా పనిచేస్తూ
ఆశయాలకు నిదర్శనంగా
విజ్ఞానానికి ఆదర్శంగా నిలిచి
మాతృమూర్తిగా నాపై అనురాగం చిలికిస్తూ
సోదరిగా నాపై వాత్సల్యం కురిపిస్తూ
తోటి స్త్రీగా నన్ను ఆదరించే
నా గురుమూర్తి
ఆచార్య నాయని కృష్ణకుమారి గారికి
**సంఘంచేసిన భిక్షుకి**
నాటికను
చిరు కానుకగా సమర్పిస్తున్నాను

వాసా ప్రభావతి.

# అందరికి వందనాలు

ఒక యదార్థ సంఘటనకు రూపకల్పన ఈ నాటిక, ఎందరో యువతీమణుల జీవితాలు నేడు వరకట్నానికి బలై పోతున్నాయి. కమల జీవితం గురించి వినడమే కాకుండా ఒకరోజు ఆ కమలను చూడడంకూడా తటస్థించింది. నా మనసు బరువెక్కింది. నా గుండె ఆ భారాన్ని మోయలేక విలవిల్లాడింది. బరువెక్కిన మేఘం వర్షించి తేలికైనట్లుగా నాబాధను నలుగురికి పంచి నా గుండె భారాన్ని తగ్గించాలనుకుని ఆ కథను నాటికగా రూపం దిద్దాను. సమాజంలో ఏ కొంతమంది నాటికను చదివినా నా రచన ధన్యమవుతుందని మీ ముందు ఉంచుతున్నాను. ఎందరో సహృదయులు. అందరికి నా వందనాలు.

ఈ నాటికను రాయడానికి నా వెనుకనుండి నన్ను ప్రోత్సహించిన నా ఆత్మీయులకు కృతజ్ఞతలు అందచేస్తున్నాను. నాటికను చదివి 'నామాట'లో నారచనపై గల అభిమానాన్ని తెలియజేసిన సాహితీచైతన్య పోతుకూచి సాంబశివరావు గారికి, ఎంతో అభిమానంతో తమ అభిప్రాయాన్ని అందించిన సాహితీమూర్తి డా॥ మొదలి నాగభూషణ శర్మ గారికి కళాభివందనాలు అందజేస్తున్నాను. కవరు పేజీ చూసి పుస్తకాన్ని చదవాలి అన్నట్టుగా నా రచనలకు మరింత శోభాయమానంగా ముఖచిత్రం వేసిన సోదరులు శ్రీ శీలా వీర్రాజుగారికి ప్రత్యేకమైన కృతజ్ఞతలు అందజేస్తున్నాను. నకాలంలోఅచ్చు వేసి కవరుపేజీతో పాటు పుస్తకాన్ని అందంగా తీర్చిదిద్దిన స్నేహలతా ప్రింటర్స్ యాజమాన్యానికి ఆ ప్రెస్‌లో పనిచేసే సోదర కార్మికులకు నా కృతజ్ఞతలు.

నా యీ ప్రయత్నాన్ని ప్రేక్షక మహాశయులు ఆదరిస్తారని ఆశిస్తున్నాను,

వాసా ప్రభావతి.

# నా మాట

డా॥ వాసా ప్రభావతి రచించిన సంఘంచేసిన భిక్షుకి, ఉత్తమ నాటిక. వరకట్న దురాచారం ప్రాతిపదికగా ఒక స్త్రీమూర్తి భర్త, అత్తల క్రూరత్వం వల్ల ఇంటినుంచి గెంటబడి ఎలా భిక్షుకిలా మారిపోయిందో యీ నాటికలో ఇతివృత్తం. నాటికమధ్య పాటలు రచించి నాటిక కథా గమనానికి కొంత సంగీతం ద్వారా ప్రేక్షకులలో ఉత్తేజం కలిగించడానికి రచయిత్రి కృషి చేశారు.

ఇదివరలో విశ్వసాహితి అధ్వర్యంలో జరిగిన ఒక కథలపోటీలో యీ నాటికా ఇతివృత్తం కథగా ఉండగా! శ్రీమతి ప్రభావతికి ఉత్తమ బహుమతి లభించింది.

ఏ ఇతివృత్తాన్నైనా, అన్ని సాహితీ ప్రక్రియల్లోకి మలచవచ్చని డా॥ ప్రభావతి యీ నాటిక ద్వారా ఋజోవుచేశారు.

'కావ్యేషు నాటకం రమ్యం' అన్న సూక్తి ఆధారంగా ఒక కథను నాటికగా అందించి శ్రవ్య, దృశ్య రంగాలను ఈమె రంజింప చేశారు.

కమలపాత్ర హృదయవిదారకంగా మలచి, ప్రేక్షకులలో సాను భూతి, సంఘర్షణ సృష్టించి, మంచినీతిని డా॥ ప్రభావతి యీ నాటిక ద్వారా అందించారు.

సంఘంలో గర్హనీయులుగా చెలామణీ అయ్యే వారిని సంఘమే అటువంటి బొమ్మలు తీర్చి దిద్దిందని డా॥ ప్రభావతి సమాజంపై ఒక విసురు విసిరారు.

నాటికలోనిసంభాషణలు సరళమైన సులభశైలిలో పండిత పామర జనరంజకంగా ఉన్నాయి.

ప్రతిభావంతులైన నటీనటులు, ఉత్తమ దర్శకుడు లభించిన పక్షంలో యీ నాటిక ప్రదర్శన ద్వారా బహుజనాదరణ పొందగలదు.

సమాజంలో సాంఘిక విప్లవానికి మూలం నాటకరచనమని చెప్ప వచ్చు. ఉత్తమ నాటక ప్రదర్శనలు సమాజాన్ని క్రొత్త పంథాలో నడిపి స్తాయి. డా॥ ప్రభావతి నాటికకూడా యీ మార్గములో ఉన్నత శ్రేణి నాటికగా భావించవచ్చు. రచయిత్రికి నా ధన్యవాదాలు.

| | |
|---|---|
| 6-3-195 | పోతుకూచి సాంబశివరావు |
| న్యూబోయిగూడ | ఉపాధ్యక్షులు ఆం. ప్ర. |
| సికింద్రాబాద్-3 | నాట్యసంఘం |

ఆచార్య మొదలి నాగభూషణ శర్మ
అధ్యక్షులు, నాటక శాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయము

హైదరాబాదు
23-4-1985

ఇంతకు పూర్వమే తమ రచనలతో, ఇతర సాంస్కృతిక, సాహిత్య కార్యకలాపాలతో తెలుగుసాహితీ లోకానికి చిరపరిచితురాలైన డాక్టర్ వాసా ప్రభావతిగారు తమ ఈ నాటకానికి పీఠిక వ్రాయమని నన్ను కోరడం నా ప్రయోజకత్వం కన్న ఆమె అభిమానానికి ఎక్కువ నిదర్శనం.

నాటక ఇతివృత్తం సమకాలీన సమాజాన్ని కలచి వేస్తున్న వరకట్న సమస్య. మగ రచయితల కన్న స్త్రీ రచయితలు ఈ సమస్యకు ఎక్కువ న్యాయం చేకూర్చ గలరన్నది నిర్వివాదం. ఈ నాటకంలో ఆ ప్రయత్నం ఆసాంతం ధ్వనిస్తున్నది. ప్రతిరంగానికిముందు ఆ రంగం లోని సంఘటనను సంక్షిప్తంగా గేయంద్వారా ప్రేక్షకులకు పరిచయం చేయబూనడం కొత్తగా వుంది. మొత్తంమీద చక్కని ప్రయత్నం.

ఇంతకన్న పటిష్ఠమైన నాటకీయ భాషను, సంక్లిష్ట మైన ఇతివృత్త నిర్మాణ విధానాన్ని తాము ముందుముందు వ్రాసే నాటకాలలో చక్కగా పెంపొందించు కోగలరని సంభావిస్తూ రచయిత్రిని అభినందిస్తున్నాను.

# సంఘం చేసిన శిక్షకి

## నాటిక

### ఇందలి పాత్రలు

కమల :- నాయిక (20 సం॥ ల యువతి)

సుబ్బారావు :- కమల భర్త

మంగమ్మ :- కమల అత్తగారు

తల్లి :- కమల తల్లి

పిల్ల:- కమల కూతురు (4 సం॥ వయసు)

కుంటి, గుడ్డి:- బిచ్చగాళ్ళు

(ఇద్దరు లేక నలుగురు అమ్మాయిలు) :- పూర్వరంగ గాయకులు.

# సంఘంచేసిన భిక్షుకి

## పూర్వరంగం

( ఇద్దరు లేక నలుగురు అమ్మాయిలు ప్రవేశం )

తల్లుల్లారా-తండ్రుల్లారా!
అన్నల్లారా-అక్కల్లారా
విన్నారా-ఈ సంఘంచేసిన
భిక్షుకి-శోకగాథనూ॥
చాలీ చాలని సంసారంలో
నలుగురు పిల్లల నడుమా
ముద్దుగ పెరిగెను కమలమ్మా
విద్యా బుద్ధులు నేర్చెను ఆ అమ్మా!
వయసు వచ్చిన కమలమ్మా
కుందనపు బొమ్మై మిల మిల మెరిసెను
నలుగురు వెంటా నడచిన ఆ తండ్రీ
చదువుకుంటానని మొత్తుకుంటే
మెడలు వంచి పెళ్ళికుదిర్చెను
ఇచ్చిన కట్నం చాలదని
చేసిన మర్యాదలు చాలవనీ
వేచీ పెట్టెను ఆ అత్తా!

ఆ మాట కాదనడూ ఆ వరుడూ॥

ఉన్నది ఇచ్చి చాలని దానికి

అప్పులు తెచ్చి అత్తింటికి

పంపెను కన్న కూతురును

అప్పులపాలై మంచమెక్కెనూ ఆ తండ్రీ॥

క॥ కొత్తగా అత్తింట్లో అడుగు పెట్టిన ఆ కమలను మాటి మాటికీ భర్త కట్నంకోసం వేధిస్తూనే ఉన్నాడు. మాటి మాటికి ఆ అత్త సాధిస్తూనే ఉంది. వారి చేతుల్లో నలిగిపోతున్న కమలను మీరే చూడండి.



# సంఘం చేసిన భిక్షుకి

## మొదటి రంగం

(స్థలం-హాలు- మూడు కుర్చీలు, చిన్న టీపా, గోడకు రెండు క్యాలెండర్లు వగైర)

సుబ్బారావు బయటనుంచి కూనిరాగాలు తీస్తూ హాల్లో అడుగు పెడతాడు.

సుబ్బా;- కమలా! కమలా!

కమల:- వస్తున్నానండీ! వస్తున్నా!

(చీర కొంగుతో చెయ్యి తుడుచుకుంటూ ప్రవేశం)

సుబ్బా:- (కుర్చీలో కూర్చుంటాడు) నేను వచ్చే సమయానికి హాయిగా తల దువ్వుకొని, వయ్యారంగా వాలుజడ వేసుకుని, జడనిండా పూలుపెట్టుకొని ఎదురు రావాలని చెప్పానుకదా, ఇలా పెంటచ్చిలా ఎదురయితేఎలా? నా మూడ్సు పాడై పోతాయి. వినబడుతోందా!

కమల:- (తలవంచుకొని) వినబడుతోందండీ!

సుబ్బా:- ఆఫీసులో అలిసిపోయి ఇంటికివచ్చేటప్పటికి ఎంతో సరదాగా ఉండాలి. ఇదిగో ఇలా వాడిపోయిన మొహంతో కాదు.

కమల - నాకూ ఉండాలని ఉందండీ! కాని వంటింట్లో పని పూర్తి కాలేదండీ!

సుబ్బా:- నాన్‌సెన్స్ అవన్నీ తర్వాత చేసుకోవాలి. అయినా మీనాన్నని వెంటనే ఒక గాన్‌పొయ్యి, కుక్కరు కొనమని చెప్పు, కూతురు ఆడుతూ పాడుతూ సంసారం చెయ్యాలంటే ఆమాత్రం తండ్రి సారె పెట్టకపోతే ఎలా?

కమల:- మా నాన్నకి అంత శక్తి లేదండీ! (నసుగుతూ చెబుతుంది)

సుబ్బా:- ఛీ! ఛీ! మీ నాన్నను ఏమీ అనకుండానే ఏడుపు మొహం పెట్టే స్తావు. నీ మొహం చూస్తే నా ఉత్సాహం ధర్మామీటరులో పాదరసం జారినట్టు జారిపోతుంది. వెంటనే నవ్వాలి- వన్- టూ, త్రీ- నవ్వాలి.

కమల:- అలాగేనండీ (నవ్వుతుంది.)

సుబ్బా:- ఇల్లు ఇంత ప్రశాంతంగా ఉంది, మా అమ్మ ఇంట్లో లేదా!

కమల:- లేరండీ! గుడికి వెళ్ళారు.

సుబ్బా:- అదా సంగతి. ఇంతసేపు చెప్పవేం! అంత దూరంగా నిలబడతావేం, ఇలా వచ్చి నావక్కన కుర్చీలో కూర్చో (ఆమె చెయ్యి పట్టుకుని కుర్చీలో కూర్చోపెడతాడు.)

కమల:- మీ అమ్మగారు వస్తారేమోనండీ!

సుబ్బా:- మా అమ్మవస్తే భయమా! అలా బెదురుతూ కాదు హాయిగా కూర్చోవాలి. కూర్చోడానికి మెత్తని సోఫాలుంటే ఎంత బాగుండేదీ! మీ నాన్నని వెంటనే కొని పంపమని రాయి.

కమల:- మాటి మాటికి మానాన్న సంగతే కాని మీ సంగతి చెప్పరేమండీ!

సుబ్బా:- చెప్పడానికేముంది! మీ నాన్నను పూర్తి కట్నం పంపించమను, అవి నీకే ఇచ్చేస్తాను. ఆడదాని డబ్బు నాకెందుకు చెప్పు.

కమల:- ఎంతని తెచ్చిపెడతాడండీ మానాన్న. పెళ్ళిలో కట్నంకంటె లాంఛనాలకే ఎక్కువ ఖర్చయింది. అందుకే అసలు కట్నం ఇచ్చుకోలేకపోయాడు. (లేవబోతుంది.)

సుబ్బా:- అప్పుడే అలా పారిపోతే ఎలా (కూర్చోపెట్టి పట్టుకుంటాడు) నీ మెత్తని చేతులతో నవ్వుతూ కబుర్లు చెబుతూ; ఈ బూట్లు విప్పి వక్కకు పెట్టకూడదూ! ఇలాటి పనులు చెప్పకుండా

చెయ్యాలి తెలిసిందా? (ఆమె ముక్కు పట్టుకుని తిప్పుతాడు) కాలు ఆమె కూర్చున్న కుర్చీ మీద పెడతాడు.

కమల:- బూట్లు విప్పుతూ ఉంటుంది.

సుబ్బా:- అలా మాట్లాడకుండా మొహం ముడుచుకుని కాదు- చిరునవ్వు నవ్వుతూ! ఏదీ ఒక నవ్వు.

కమల:- (లేని నవ్వు తెచ్చుకొని ఒక బూటు విప్పి పక్కకు పెడుతుంది. రెండో బూటు విప్పబోతుంది.

(అంతలో అత్తగారు మంగమ్మ ప్రవేశం)

మంగ:- ఎప్పుడొచ్చావురా అబ్బాయీ! పక్కన కూర్చుని సరసా లాడుతున్నావూ!

కోడలిని పరిశీలించి చూస్తుంది. (కమల లేచి నిలబడుతుంది.)

సుబ్బా:- ఇప్పుడే వచ్చానమ్మా!

మంగ:- అదేంపనే? ఎవడో పనిలేని నీలాటివాడే పిల్లితల గొరుగుతూ కూర్చున్నాట్ట- కాస్త పనికొచ్చే పని చెయ్యాలే, అయినా ఒరే, సుబ్బూ! నీకు బూట్లు విప్పుకోడానికి కూడా బద్ధకమేరా! పెళ్ళై పెళ్ళాంరాగానే సామ్రాజ్యాధిపత్యం వచ్చిందనుకుంటున్నావురా?

సుబ్బా:- అదేమిటమ్మా! అలా అంటావు. నేను ప్రేమ సామ్రాజ్యానికి అధిపతిని. ఒక సతికి పతిని పతిసేవ చెయ్యడానికి ఆమె సిద్ధంగా ఉంది. ఇంతకంటె ఏం కావాలమ్మా నాకు.

మంగ:- చాల్లేరా! సంబరం. ప్రేమ ముదిరి వెర్రిలోకి దిగినట్టుంది. ఈ లోకంలో ఎందుకూ పనికిరానిదేమిటంటే ఈ ప్రేమే. ప్రేమ తిండి పెడుతుందా. కట్నం తీసుకొస్తుందా! కనీసం మీ మావ దగ్గరనుంచి కట్నం వసూలు చెయ్యలేకపోతున్నావు? చివరకు

నువ్వు ఎందుకూ పనికిరాకుండా తయారయ్యావు? ఏమే ఇంకా అక్కడ ఏం చేస్తున్నావు?

కమల:- ఏంలేదత్తయ్యా, (రెండో కాలిబూటు కూడా విప్పి పక్కకు పెడుతుంది.)

మంగ:- ఏం లేదంటూ ఇంకా అక్కడే నిలబడతావేమే నా మొహాన్ని ఇంత కాఫీ పోసేది ఉందా లేదా!

కమల:- ఇప్పుడే తయారుచేసి పట్టుకొస్తానత్తయ్యా!

(కమల లోపలకి వెళ్ళును.)

సుబ్బా:- మొన్ననే కదమ్మా! మావగారు ఉత్తరం రాసాడు. వీలు చూసుకుని పంపిస్తానన్నాడు కదా!

మంగ:- పెళ్ళయింది మొదలు అలా అంటూనే ఉన్నాడు. అది ఒచ్చేది కాదు చచ్చేది కాదు.

సుబ్బా:- ఇవ్వకపోతే వదులుతానా వెంటనే రిప్లైకార్డు రాసిపడేస్తాను.

మంగ:- ఏం రాస్తే ఏం ప్రయోజనంరా! దున్నపోతుమీద వర్షం పడితే ఎంతో మీ మావకి ఉత్తరం రాసినా అంతే. చివరకు బాకీ తీర్చకుండానే గుటుక్కుమనేటట్టున్నాడు. ఈ ఉత్తరాలతో లాభం లేదురా! వాళ్ళ తిక్కకుదరాలంటే ఒక పని చెయ్యాలి.

సుబ్బా:- చెప్పమ్మా! వెంటనే అమలు చేద్దాం! చెప్పమ్మా!

మంగ:- ఏముందిరా వెంటనే మీ అమ్మాయిని రైలెక్కిస్తున్నానని రాసి పడై.

సుబ్బా:- అదెంతసేపమ్మా! కాని దాన్ని పంపించేత్త మనకే నష్టమమ్మా ఇక్కడ మనకి వంటపని ఇంటిపని ఎవరు చేస్తారు కోడలు వచ్చాక నువ్వెందుకు పనిచెయ్యాలమ్మా! అసలు నేను పెళ్ళి

ఎందుకు చేసుకున్నాననుకున్నావు? నిన్ను కూర్చోపెట్టి అన్నీ చేయడానికే!

మంగ:- అదీ నిజమేరా! అసలు నేను ఏపని చెయ్యలేక పోతున్నాననుకో. నాలుగడుగులు వేస్తే ఆయాసం. కాఫీ పట్టుకొస్తానని వెళ్ళి ఎంతసేపయిందో. తల పగిలి పోతోంది. ఎక్కడకెడితే అక్కడే - ఏం నాన్న మనిషో ఏమిటో!

(లేచి లోపలకి వెడుతుంది.)

సుబ్బా:- (పేపరు చేత్తో పట్టుకుని కూనిరాగాలు తీస్తూ ఉంటాడు.)

కమల:- కాఫీ ఇదిగోనండి. (దగ్గరకెళ్ళి కాఫీకప్పు అందించబోవును.)

సుబ్బా:- అంత దూరంగానా కూర్చోడం. ఇలా వచ్చి నాపక్కన కూర్చుని నాచేత తాగించాలి తెలిసిందా. (చెయ్యిపట్టుకుని పక్కనే కూర్చోపెడతాడు.)

కమల:- మీ అమ్మగారు ఇంటిలోనే ఉన్నారండి. (కాఫీకప్పు అందిస్తుంది).

సుబ్బా:- మా అమ్మ ఇప్పుడు ఇక్కడకు రాదు. నువ్వేం భయపడకు. (ఆమె కట్టుకున్న చీర పట్టుకు చూసి) ఇదేంచీర కమలా: ఛీ! ఛీ! నువ్విలా అప్పలమ్మ చీరలు కట్టుకుంటే నాముఖాన్న పాడై పోతాయి మీ నాన్నని షిఫాన్, జార్జిట్, చైనాసిల్కు చీరలు పంపించమని రాసెయ్యి. ఆ చీరలో సినిమా హీరోయిన్‌లా మెరిసిపోతూ నా పక్కన కూర్చుంటే, నామనస్సు అలా ఆనందలోకాల్లో తేలి పోతుంది తెలిసిందా!

కమల:- మానాన్న అవన్నీ ఎక్కడ కొనివ్వగలడండీ! మీరే సరదాగా ఒక షిఫాన్ చీర కొనిపెట్టండి!

సుబ్బా:- నాకూ కొనాలనే ఉంటుంది కమలా! కాని మా అమ్మకే ఇష్టముండదు. ఆవిడ మనస్సు కష్టపెట్టడం నాకిష్టముండదు. ఏదో

పెళ్ళయిన కొత్తకదా అత్తవారు పంపించారంటే నలుగురు ఎంత మెచ్చుకుంటారో తెలుసా!

కమల:- నలుగురు మెచ్చుకుంటారుకాని మా నాన్నగారికి ఎంత కష్టమో ఆలోచించరేమండీ నాకు పెళ్ళిచేసి పంపించడానికే మా నాన్నకు చాలా కష్టమయింది. ఇంకా నావెనక చెల్లెళ్లు, తమ్ముళ్ళు ఉన్నారు కదండీ!

సుబ్బా:- అదిగో అప్పుడే మొహం ముడుచుకుపోతోంది. మీనాన్నని ఏమీ అననులే. అయినా ఈ రోజు నీనోటమ్మట పెద్దపెద్ద విషయాలు వస్తున్న వేమిటి?

కమల:- ఏమండీ! (నసుగుతుంది)

సుబ్బా;- చెప్పు. ఆగిపోయావేం (గెడ్డం పట్టుకుని ముఖం పైకెత్తి) నా దగ్గర మొహమాటపడితే ఎలా? చెప్పాలి?

కమల:- అదికాదండీ! సినిమా చూడాలని...

సుబ్బా:- సినిమా చూపించాలంటావు? అంతేకదా! నేనురెడీ మనం నడిచో లేక రిక్షాలోనో వెడితే ఏం బాగుంటుందిచెప్పు. ఒక స్కూటరుండాలి. నువ్వు నాభుజం మీద చెయ్యేసి కూర్చోవాలి. మనం గాలిలో తేలిపోతూ చిలకా గోరింకల్లా సినిమాకు వెళ్ళాలి. అందుచేత వెంటనే కట్నం బాకీ తీర్చమని మీ నాన్నకు ఉత్తరం రాసెయ్యి.

కమల;- (తల వంచుకుని కళ్ళు తుడుచుకుంటుంది.) మొన్ననే కదండీ ఉత్తరం రాసాడు. త్వరలోనే సర్దుబాటు చేస్తానన్నాడు కదా ? ఆయనసలే అనారోగ్యంగా ఉన్నారు. మాటిమాటికీ ఉత్తరంరాసి ఆయన్ని బాధపెట్టలేనండీ!

సుబ్బా:- అబ్బే నువ్వలా మీనాన్నని వెనకేసుకొస్తేకాదు నేనేమంటే

నువ్వదే అనాలి. నామాటే నీకు వేదవాక్కు. నీ పతిదేవుణ్ణి నేను. నువ్వు మహాపతివ్రతవుకావాలి, తెలిసిందా!

కమల:- (అతనివైపు ఆశ్చర్యంగా చూస్తుంది. కాఫీ తాగిన కాళీ కప్పు అందుకుని అక్కడనుంచి లేవబోయింది. కాస్త తలతిరిగి మళ్ళీ కూర్చుంటుంది.

సుబ్బా: ఏమయింది? (లేచి ఆమెను పట్టుకుని ఆమె చేతిలో కప్పు అందుకుని టీపామీద పెడతాడు.)

కమల : ఏం లేదండీ?

(కాస్త తేరుకుని సమాధానం చెబుతుంది.)

సుబ్బా:- (ఏమయింది కమలా?)

తిరిగి కూర్చోబెట్టి పట్టుకుంటాడు.)

( మంగమ్మ ప్రవేశం )

మంగ:- అయ్యో! అయ్యో! అదేమిటే కొంపతీసి వేవిళ్ళేమిటే! ఒరే అబ్బాయోయ్ మీ ఆవిడ కొంప ముంచేసిందిరోయ్.

సుబ్బా:- ఏమయిందమ్మా!

మంగ:- ఇంకేమవ్వాలిరా! పెళ్ళై ఆరెల్లు కాకుండానే మీ ఆవిడ తల్లి కాబోతోందిరా!

సుబ్బా:- అలాగా అమ్మా (కమలవైపు తిరిగి)

నాకు చెప్పవేం కమలా? మనకు బుజ్జి పాపాయ్ పుడతాడన్న మాట. వాడికి చిన్న కళ్ళు, చిన్న ముక్కు, చిన్ని చెవులు. బుజ్జి బుజ్జి చేతులు ఉంటాయి. వాడు నాన్నా నాన్నా అంటు నా వెంట పరుగెతుకొస్తాడు హాయ్ హాయ్.

(సంతోషంతో గిరగిరా తిరుగుతూ ఉంటాడు)

మంగ:- నువ్వో అమాయకుడివిరా! దానికి నెలతప్పితే నీకా ధోరణి ఏమిట్రా!

సుబ్బా:- తిరగడం ఆగి నేనేం చేసేనమ్మా!

మంగ:- ఏం చెయ్యడమేమిట్రా; నువ్వో మాలోకానివి? ముందు వెనకా చూడకుండా! ఆ తిరుగుడేమిటిరా! మీ మావ పెళ్ళినాటి కట్నమే తీర్చలేదు. ఇంక ఈవిడగారి పురిటి ఖర్చంతా ఎవరుభరిస్తారు. ఇదంతా మన నెత్తినే చుట్టుకుంటుందిరా। ఇప్పుడేమిటిరా మనకు దారి!

(తల రెండు చేతులతోనూ పట్టుకొని కుర్చీలో కూర్చుంటుంది.)

సుబ్బా:- నువ్వేం భయపడకమ్మా; ఆ సంగతి నేను చూసుకుంటాను. మా మావకి వెంటనే రిప్లై టెలిగ్రాం ఇచ్చేస్తాను.

మంగ:- అక్కడనుంచి ఒక్కపైసా వచ్చేది ఏడ్చేది లేదు కాని టెలిగ్రాముల దండగ ఎందుకురా!

సుబ్బా:- కమలా! లోపలికెళ్ళి పడుకుంటా వేమిటి?

(ఆమె భుజంమీద చెయ్యివేసి అడుగుతాడు)

(బయటనుంచి టెలిగ్రాం. టెలిగ్రాం కేకలు వినబడుతాయి.)

టెలిగ్రామా?

(బయటకువెళ్ళి తిరిగి టెలిగ్రాం కాగితం చదువుతూ లోపలకి వస్తాడు.)

మంగ:- ఎక్కడనుంచిరా చెప్పవేం?

సుబ్బా:- వాళ్ళ నాన్నకి సీరియస్‌గా ఉందిట కమలని వెంటనే పంపించమని రాసారు.

కమల:- నాన్నా (ఏడుపు మొదలు పెడుతుంది.)

మంగ:- అప్పుడే ఆ వెధవ ఏడుపెందుకే! ఒరే అబ్బాయోయ్ ఇంక నీ కట్నం గోయిందా! నేను అంటూనే ఉన్నారా! బతుకుండగా వసూలు చేసుకోవాలని? నామాట వింటేనా?

కమల:- ఏమండీ: నన్ను మా నాన్న దగ్గరకు పంపించండీ; మా నాన్నని ఒక్కసారి చూడనివ్వండి?

(వెక్కి వెక్కి ఏడుపు)

సుబ్బా:- ఏడవకు కమలా! ఏడవకు! అలాగె వెడదాంలె!

(ఆమె తల నిమురుతాడు.)

మంగ:- చావకుండానె ఆ ఏడు పెందుకే సిగ్గులేదు. కట్నం బాకీకూడా తీర్చలేని వాడిని చూసే దేమిటే? డబ్బులు దండగ! అటో ఇటో తేలేక వెళ్లిరావచ్చు.

కమల:- నాన్నా. (ఏడుపు)

సుబ్బా:- ఏడవకు కమలా! అసలే వట్టిమనిషివి కూడా కాదు. ఊరుకో

మంగ:- ఏమిట్రా చంటి పిల్లలా అలా బతిమాలుతున్నావు? ఎంత పెళ్ళాం అయితే మాత్రం అలా నెత్తికెక్కించుకో కూడదు? కాస్త హద్దుల్లో ఉంచాలి.

(కమల వైపు తిరిగి.)

నట్టింట్లో ఆ వెధవ ఏడుపేమిటే ? ఇంకా ఎవడు చావలేదుగా ? ముందు నోరు మూసుకో

కమల:- (నోటికి కొంగు అడ్డు పెట్టుకుంటుంది)

నాన్నా! నాన్నా!

(ఆపుకోలేక ఏడుస్తుంది.

సుబ్బా: ఊరుకో కమలా ఊరుకో!

మంగ:- ముందు నువ్వు నోరు మూసుకుని లోపలికి నడవరా!

(కమల వైపు తిరిగి)

ఏమిటే ఆ వెంకి తనం! అన్నింటికీ నీ యిష్టమే. కాని కట్నం బాకీ తీర్చలేని తండ్రిని చూడ్డానికి ఏ మొహం పెట్టుకుని

బయలుదేరుతావే? ఆ ఏడుపులు గాడుపులు కట్టిపెట్టి వంటింట్లోకి వెళ్లి వంట సంగతి చూడు.

కమల:- అత్తయ్యా! మీకాళ్ళు పట్టుకుంటాను. ఒక్కసారి మా నాన్నను చూసిరానీయండి అత్తయ్యా!

(ఆమె కాళ్ళు పట్టుకోబోయింది.)

సుబ్బా:- పోనీ ఒక్కసారి చూపించి తీసుకొస్తానమ్మా;

మంగ:- ముందునువ్వు లోపలికి వెడతావా లేదురా!

(సుబ్బారావు లోపలికి వెళ్ళాడు.)

(మంగమ్మ కాళ్ళు విడిపించుకుంటూ)

లేవే: నీ దొంగ వేషాలు నా దగ్గరకాదు. లే? లేచి వంటింట్లోకి నడు.

కమల:- అత్తయ్యా! నన్ను ఒక్కసారి చూసి రానీయండి. ఇంకెప్పుడూ వెడతానని అడగనత్తయ్యా!

(కాళ్ళు పట్టుకోబోతుంది.)

మంగ:- నీ ఖర్మే అలా ఏడు.

(కాళ్లు విడిపించుకుని లోపలకి వెళ్ళిపోయింది.)

(కమల నేలమీద అలాగే ఏడుస్తూ ఉంటుంది.)

(తెర పడుతుంది.)

## పూర్వ రంగం

కాలి పారాణి ఆరకముందే
వలపు తోట పూయకముందే
తాళి కట్టిన వతే కాలయముడై
కట్నమంటూ కాలరాసెనా ॥
ఇంటిడి వనిని మీదను వేసి

మనసులో ఆరని చిచ్చును రేపి
సాటి ఆడదనే ఆదరము లేక
రాపిడి పెట్టెను ఆ అత్తా!
కాలమెంత మారినా
నోరులేని ఆడువారికి
రంపపు కోతలే విధిరాతలా
చావు దెబ్బలే నుదుటి గీతలా ॥

వ॥ వలపు పొంగులలో కాలుపెట్టిన ఆ కమల ఆశలన్నీ మొగ్గలోనే వాడిపోయాయి. రోజురోజుకి ఆ తల్లీ కొడుకులు కలిసి కమలను వేధించడం మొదలుపెట్టారు. కమల జీవితం నరక ప్రాయమై పోయింది. చివరకు ఆ యింటికే బలై పోయిన ఆ కమలపాట్లను మీరే చూడండి.

## రెండవ రంగం

(స్థలము అదేహాలు)

(కమల చీపురుతో ప్రవేశం. చంకలో చంటిపిల్ల.)

కమల:- రోజూ ఈ పని ఉండేదే. నీకు పౌడరురాశి బొట్టెట్టనా! తల్లీ!
(చీపురు పక్కకు పడేసి పౌడరు రాస్తూ ఉంటుంది.)
నా తల్లి ఎంత అందంగా ఉందో
నా తల్లి బంగారు తల్లి
నా తల్లి మెడలో ముత్యాల పేరు
నా తల్లి తల్లో రత్నాల బిళ్ళా
(మంగమ్మ ప్రవేశం)

మంగ:- ఏం పని లేనట్టూ ఆ చంటిదాన్ని ముద్దాడుతూ కూర్చున్నావా? పనంతా ఎవరు చేస్తారనుకున్నావే ?

కమల:- లేదత్తయ్యా! పిల్లకు కాస్త పౌడరు రాస్తున్నా అంతే!

మంగ:- పొడరే రాస్తున్నావో బూడిదే రాస్తున్నావో నాకెందుకే!
(చీపురు వైపు చూసి)
అయ్యో! అయ్యో! ఇంకా ఇల్లుతుడవడం కూడా పూర్తికాలేదులే.
ఓ మూల చీకటి పడుతోంది. కళ్ళుకనపడ్డంలేదూ!
ఈ చంటిదాని ఒంకొకటి దొరికింది. ఇలాతే దీన్ని
(బలవంతంగా ఆ పిల్లను లాక్కొని ఎత్తుకుని లోపలకు పంపి
తిరిగి వస్తుంది.)

కమల:- ఇప్పుడే తుడిచేస్తా నత్తయ్యా
(చీపురు అందుకుని ఇల్లు తుడవడం ప్రారంభిస్తుంది.

మంగ:- ఎక్కడ పడేసిన గొంగళి అక్కడే అన్నట్టుగా ఏ పని చెబితే
అక్కడే. మాకెక్కడ దాపరించావో కాని నీతో అరవలేక
గొంతుక నొప్పి పుడుతోంది. అది సరే కాని మీ అమ్మ దగ్గర
నుంచి ఈ రోజేన ఉత్తరం వచ్చిందా! లేదా!

కమల:- (తలఎత్తి చూస్తూ) లేదత్తయ్యా!

మంగ:- ఎందుకొస్తుందే! రాదు. కట్నంఇవ్వకుండా మీ నాన్న గుటుక్కు-
మన్నాడా! ఇంక మీ అమ్మకూడా కాటికి కాళ్లు చాచుకుని
కూర్చుందా పీలాటి అబద్ధాల కోడల్ని నమ్మడం మాదే తప్పే!

కమల:- అంతమాట అనకండి అత్తయ్యా! వీలు చూసుకుని తప్పకుండా
పంపించేస్తుంది.

మంగ:- ఇదిగో ఇలానమ్మే! మోసపోయామే! మాటలకేమి లోటే!
ఎన్నైనా చెప్పచ్చు. మీ వాళ్ళ దగ్గర కట్నం వసూలు చేసుకు
రావడం చేతకాదు కానీ వెనకేసుకు రావడం బాగా తెలుసు.

కమల:- అది కాదత్తయ్యా!——

మంగ:- ఇంక నాకేమి చెప్పక్కరలేదు కాని ఆవంట సంగతేదో కాస
త్వరగా చేసి ఏడు.

కమల:- ఇదిగో ఇప్పుడే ప్రారంభిస్తానత్తయ్యా!

మంగ:- ఇంకా ప్రారంభించడమేమిటే! ఎప్పుడు పూర్తవుతుందో. ఎప్పుడు తింటామో!

(ఇంతలో సుబ్బారావు తాగిన మైకంలో. తూలుతూ ప్రవేశం)

సుబ్బా:- ఏం జరిగిందమ్మా!

(ముద్ద మాటతడబడుతూ ఉంటుంది.)

మంగ - ఏం జరగడ మేమిట్రా! నిత్యం ఉన్నదే! ఒకమూల చీకటి పడు తోందా! ఇంకా ఇల్లు తుడవడం పూర్తికాలేదు. ఏం చేస్తున్నావే అంటే మాత్రం తడుముకోకుండా సమాధానాలు చెబుతుంది. అది మాత్రం బాగా నేర్చుకుంది.

సుబ్బా:- ఏమే? ఏం సంగతి? నీకసలు భయం పోయిందే! నాకు కోపం వస్తే ఏం చేస్తానో తెలుసా?

మంగ:- నీ భయమే ఉంటే అదలా ఎందుకు ఉంటుందిరా!

సుబ్బా:- నిన్నే అడుగుతోంటా నోరు తెరవ్వేం! వినవడ్డం లేదా? లేక వీడేం చెయ్యగలడను కుంటున్నావా?
ఇదిగో! నేను తలుచుకున్నానంటే రెండు నిమిషాల్లో ఇంట్లోంచి వెళ్ళగొట్టేస్తాను జాగ్రత్త!

కమల:- (ఇల్లు తుడవడం పూర్తిచేసి లోపలికి వెళ్ళిపోయింది.)

మంగ:- ఏమే కట్టుకున్నవాడు ఇంటికి రాగానే కాసిని మంచి నీళ్ళు ఇయ్యాలని కూడా తెలీదు చే!

కమల:- ఇప్పుడే పట్టుకొస్తానత్తయ్యా!

మంగ:- పట్టి మాలోకం మనిషిలా ఉంది. ఏపని చెబితే అక్కడ తెల్లార వలసిందే!

సుబ్బా:- ఊరుకుంటుంటే రెచ్చిపోతోంది. నా తడాకా చూపిస్తాను.

(మాటలు తడబడుతూ ఉంటాయి)

(నీళ్ళగ్లాసులతో కమల ప్రవేశం.)

కమల:- మంచి నీళ్లు ఇవిగో అత్తయ్యా!

మంగ:- ముందు కట్టుకున్న వాడికి ఇవ్వాలని కూడా తెలీదు టే!

కమల:- వారికి ఇస్తానత్తయ్యా.

(పక్కకు తిరిగి కళ్ళు తుడుచుకుంటుంది.)

(మరో గ్లాసు సుబ్బారావుకి అందిస్తుంది.)

సుబ్బా:- (నీళ్లగ్లాసు అందుకుని) ఏమే! మా అమ్మనే ఎదిరిస్తున్నావుట

కమల:- లేదండీ!

(తల వంచుకుని నిలబడుతుంది.)

సుబ్బా:- అదిగో నాకే ఇస్తున్నావు సమాధానం ఏంతపొగరేనీకు.

(గ్లాసులో తాగగా మిగిలిన నీళ్ళు ఆమె మీద వంచుతాడు)

కమల:- (ఒంటిమీద వర్డనీళ్ళు చీరకొంగుతో తుడుచుకుంటూ ఒకసారి తలెత్తి సుబ్బారావు వైపు చూసి తిరిగి తుడుచుకుంటుంది.

సుబ్బా:- బెల్లం కొట్టిన రాయిలా మాట్లాడవేం. చూడు ఆ అకారంచూడు ముష్టి దానిలా ఎలాఉందో! మొహం చూడాలంటేనే అసహ్యం.

మంగ:- చెత్తకుండీ మొహం. ఈ రోజుల్లో చెత్తకుండీలకు కూడా మంచి రంగులేసి ఎంతో బాగా ముస్తాబుచేస్తున్నారు. మొగుడు వచ్చే వేళయిందని కూడా తెలీదు. చింపిరితలతో తయారు. నలుగురూ చూసి అత్తగారు చాకిరీ చేయిస్తోందని అనుకోవాలనేకదా!

మల:- అది కాదత్తయ్యా!

(తిరిగి ఇల్లు తుడుస్తూ ఉంటుంది.)

మంగ:- నంగనాచిలా కాదత్తయ్యా! అంటే సరిపడుతుందా వెధవ సాను భూతులు తెచ్చుకోడం బాగా తెలుసు.

కమల:- నాకేం తెలీదత్తయ్యా?

మంగ:- నీకేం తెలీదే. నిన్న పక్కింటి రామాయమ్మ కలిసి "అదేమి టండీ! మీ కోడలు వంటిల్లు వదిలి రాదా!" అని అడిగింది. ఇందాక ఎదురింటి హనుమాయమ్మ కలిసి "అదేమిటండీ మీ కోడలు ఎప్పుడు చూసినా చీపురు చేత్తో కనబడుతుందీ!" అనడి గింది. దీని పని కాదుకానీ అవమానాలు పడలేక ఛస్తున్నా ననుకో.

సుబ్బా:- నువ్వేకదమ్మా! ఈ కుదిబండని నామెడకు అంటకట్టావూ ?

మంగ - ఎప్పుడో అంటగడితే ఇప్పుడేమయిందిరా! ఇదిలా ఇంటిపని చేస్తూ ఉంటుంది. దీనిసంగతి నేను చూస్తాను. మరో డబ్బున్న అమ్మాయిని పెళ్ళి చేసుకునే ప్రయత్నం నువ్వు చెయ్యి.

కమల:- (ఆ మాటలువిన్న కమల చెయ్యి వణుకుతుంది. స్టూలుమీదున్న ఫ్లవర్‌వాజ్ కింద పడిపోతుంది. కమలభయంగా చూస్తుంది.)

మంగ:- అయ్యో! అయ్యో! నీకేమయిందే! ఇలాటి పనులు చేస్తున్నావు. చెయ్యి దగ్గర పెట్టుకుని తుడవాలని తెలీదుటే?

సుబ్బా:- ఎంత పొగరే నీకు

(ఆ దవడ ఈ దవడా వాయిస్తాడు.)

కమల - కొట్టకండి! నన్ను కొట్టకండి। పొరపాటున చెయ్యి తగిలి పడి పోయింది.

(చేతులు అడ్డు పెట్టుకుంటుంది.)

మంగ:- బాగా తగిలితే తప్ప ఆ పొగరు తగ్గదురా!

సుబ్బా:- ఎందుకు తగ్గదో చూస్తా.

(మరో రెండు వేస్తాడు.)

కమల:- అత్తయ్యా! కొట్టొద్దని మీరేనా చెప్పండి.

సుబ్బా:- ఇంకా నోరుమూసుకోవేం నీనోటికి వాగుడు ఎక్కువయిందే!
(జుట్టు పట్టుకొని తలవంచి నడుంమీద గుద్దుతాడు.

మంగ:- అదిరా అలా కొట్టాలి. దెబ్బతో దెయ్యం వదిలిపోతుంది.

కమల:- అత్తయ్యా! కొట్టొద్దని చెప్పండి అత్తయ్యా.
(ఘొల్లున ఏడుస్తూ ఉంటుంది.)
(అంతలో తల్లి ప్రవేశం)
(సుబ్బారావు కొట్టడం ఆపుతాడు.)

తల్లి:- అమ్మా! కమలా! నిన్నిలా చూస్తాననుకోలేదే!
(వెక్కి వెక్కి ఏడుపు.)

కమల:- అమ్మా! నన్ను చూసి సంతోషించాలని వచ్చావా! అమ్మా!
(తల్లికి దగ్గరగా వెళ్ళి కౌగలించుకోబోతుంది.)

సుబ్బా:- ఆగు అక్కడే ఆగు- కాలు ముందుకు వేసావో చంపేస్తాను
(కమలకు తల్లికి మధ్య అడ్డుగా నిలబడతాడు.)

తల్లి:- కమలా! నేనెంత పాపం చేసానే తల్లీ! నాకళ్ళు ఎంత పాపిష్టివే
అమ్మా! నిన్నీ స్థితిలో చూస్తాననుకోలేదే!
(వెక్కి వెక్కి ఏడుస్తుంది.)

కమల:- ఒక్కసారి నన్ను వదలండి. మా అమ్మకు దగ్గరగా వెళ్ళనీ
యండీ! అమ్మా!
(ఏడుస్తూ ఉంటుంది.)

ంగ:- ఏమిటే ఒకటే గంతులేస్తున్నావు? అన్నింటికి నీయిష్టమే-
ముందు నోరుమూసుకుని లోపలికి నడు.
(వియ్యపురాలివైపు తిరిగి.)
ఏవమ్మా! ఈసారైనా కట్నం మూటతో వచ్చావా? లేక పాత
బట్టలమూట చంకనేసుకుని చక్కా వచ్చావా?

తల్లి:- త్వరలోనే ఏదోవిధంగా డబ్బు సర్దుబాటుచేస్తానమ్మా! (తలవంచుకుంటుంది.)

మంగ:- ఆమాట అనడానికి సిగ్గులేదుటమ్మా! ఏమొహం పెట్టుకుని బయలుదేరి వచ్చావు? ఎలా వచ్చావో అలాగే వెళ్ళు.

తల్లి:- పిల్లనుచూసి చాలారోజులయింది. పిల్లను పంపిస్తే రెండురోజులుంచుకుని పంపించేస్తాను.

మంగ:- మంచిపని చేస్తావు. కట్నం ఇక్కడ పెట్టి నీకూతుర్ని తీసుకెళ్ళు.

కమల:- అమ్మా! అమ్మా!

(సుబ్బారావును తోసుకుని వెళ్ళబోతుంది.)

సుబ్బా:- ఎక్కడికే వెడుతున్నావు?

(జుట్టు పట్టుకుని గుంజి నడుంమీద గుద్దుతాడు.)

కమల:- నన్ను కొట్టకండి. నన్ను వదిలేయండి.

తల్లి:- అమ్మా! కమలా!

(కళ్ళు తిరిగి నేలమీద వరిగి పోతుంది.)

కమల:- అమ్మా! అమ్మా!

సుబ్బారావుని విడిపించుకుని తల్లిదగ్గరకు వెళ్ళబోతుంది.)

సుబ్బా:- ఇదిగో దాన్ని ముట్టుకుంటే ఇంక ఈ ఇంట్లోకి రావడానికి వీల్లేదు తెలిసిందా!

కమల:- అమ్మా! అమ్మా!

(సుబ్బారావుని తోసుకుని తల్లిదగ్గరకు వెడుతుంది. తల్లి మొహం పమిటకొంగుతో తుడుస్తుంది. ఒళ్ళు పాముతుంది. వెక్కి వెక్కి ఏడుపు.)

అత్తయ్యా! మాఅమ్మకి కొంచెం నీళ్ళు ఇవ్వండి అత్తయ్యా!

సుబ్బా:- నీళ్ళులేవు ఏమీలేవు- ఇద్దరూ కలిసి చావండి.

కమల:- అత్తయ్యా! కానిని నీళ్ళు ఇవ్వండి,
(లేచి ఇంట్లోకి వెళ్ళబోతుంది.)

సుబ్బా:- ఇంట్లోకి వచ్చావంటె చంపేస్తాను తెలిసిందా?
(రెండు చేతులు అడ్డుపెడతాడు.)

కమల:- అత్తయ్యా! కానిని నీళ్ళు ఇవ్వండి. అత్తయ్యా!

మంగ:- ఇప్పుడేదేనా జరిగితే నాయింటికొచ్చి చచ్చిందంటారు. ఇదెక్కడ గొడవరా బాబూ
(లోపలికెళ్ళి ఓచెంబుతో నీళ్ళు పట్టుకొచ్చి అక్కడ పెడుతుంది.)

కమల:- (చెంబు తీసుకుని నీళ్ళుజల్లి మొహం తుడుస్తుంది.) మెల్లిగా ఆవిడ కదులుతుంది.) మంచినీళ్ళు తాగమ్మా!
(లేవతీసి కూర్చోపెట్టి మంచినీళ్ళు తాగిస్తుంది.)

తల్లి:- ఇంక నేవెడతానమ్మా!
(పక్కనున్న మూట తీసుకుంటుంది.)

కమల:- అమ్మా! ఇంత రాత్రివేళ ఎక్కడికి వెడతావమ్మా!

తల్లి:- ఎలాగో అలాగ వెడతానమ్మా! నువ్వు జాగ్రత్తగా ఉండమ్మా!

కమల:- అమ్మా! ఆకలికడుపుతో వంపించేస్తున్నానమ్మా! ఒకముద్ద అన్నంకూడా పెట్టలేక వంపించేస్తున్నానమ్మా!

సుబ్బా:- నీ తండ్రిసొమ్ము ఇక్కడ తేరగా ఉందే వండి పెట్టలేక పోయావా!

కమల:- అమ్మా! నా పిల్లను చూడకుండానే వెళ్ళిపోతున్నావా అమ్మా!

తల్లి:- ఒక్కసారి చూపించమ్మా!

కమల:- అత్తయ్యా! నా పాపను ఇటివ్వండి!
(లోపలికి వెళ్ళబోవును.)

సుబ్బా:- ఎక్కడికే బయలుదేరి వస్తున్నావు? వెళ్ళవే వెళ్ళు మీ అమ్మతో పాటు నువ్వు కూడా వెళ్ళవే? ఇక్కడెందుకు మా నెత్తి మీద. వెళ్ళు (తల్లిమీదికి తోస్తాడు.)

(తల్లి కమలను దగ్గరకు తీసుకుని కౌగలించుకుంటుంది. ఇద్దరు వెక్కి వెక్కి ఏడుస్తారు.)

సుబ్బా:- ఇంకా అక్కడ నిలబడతారేం వెళ్ళండి ఇంక వెళ్ళండి.

తల్లి:- రామ్మా! వెళ్ళిపోదాం!

కమల:- ఒద్దమ్మా! ఒద్దు. నేనుకూడా వచ్చి నీకు బరువు కాలేనమ్మా! నేను ఇక్కడే ఉంటానమ్మా!

తల్లి:- ఖారానికేముందమ్మా? కలో గంజో తాగి బతుకుదాం!

కమల:- వద్దమ్మా; వద్దు. నేను బతికినా ఈ ఇంటిలోనే ఉంటాను. చచ్చినా ఇక్కడే చస్తాను. (తల్లిని వదలి ముందుకు వస్తుంది)

కమల:- అమ్మా! నువ్వెళ్ళిపో అమ్మా? నువ్వెళ్ళిపో.

**తల్లి**:- కమలా నే వెడుతున్నానమ్మా!

(నోట్లో పమిటకొంగు కుక్కుకుని వెళ్ళిపోతుంది.)

సుబ్బా:- పో బయటికిపో, కట్నం తీసుకురాందే లోపలికి రావడానికి వీల్లేదు. పో!

కమల:- నన్ను లోపలికి రానీయండి.

(అతన్ని తోసుకుని ముందుకు వెళ్ళబోతుంది.)

సుబ్బా:- ఎంత పొగరే నీకు? ఈ రోజుతో నీ పీడా పోవలసిందే!

(నడ్డిపంచి కొడతాడు)

కమల:- నన్ను కొట్టకండి. అత్తయ్యా మీరేనా చెప్పండి.

సుబ్బా:- నడు బయటకు నడు.

(చెయ్యి పట్టుకుని గుంజుతాడు.)

కమల:- అత్తయ్యా! మీ కాళ్ళు పట్టుకుంటాను. నన్ను ఇంట్లో ఉండ నీయండి.

(సుబ్బారావు కాళ్ళు పట్టుకుంటుంది.)

సుబ్బా:- నోరు మూసుకోవే- నువ్వీఇంట్లో ఉండటానికి వీల్లేదు.

కాళ్ళు విదిలించుకుని మరో రెండు వేస్తాడు.)

కమల:- ఏమండీ! నా పిల్లను నాకిచ్చేయండి. నా కూతుర్ని నాకిచ్చే యండి. ఏమండీ.

సుబ్బా;- ఇంకా వాగుతున్నావేమిటే.

(మరో రెండు వేస్తాడు.)

(కమల నేలకు వరిగి పోతుంది.)

(మెళ్ళో ఉన్న పుస్తెలు లాక్కుంటాడు.)

మంగ:- ఒరే అబ్బాయోయ్- కొంపతీసి చచ్చిపోయిందేమోరా! ఇప్పుడు పోలీసు కేసుకూడా వస్తుందిరోయ్.

సుబ్బా:- (దగ్గరకెళ్ళి చూస్తాడు. కాస్త మత్తు దిగుతుంది. అప్పుడే ఎక్కడ చస్తుందమ్మా! వాళ్ళమ్మతోపాటే అదే పోతుంది (మంగమ్మా సుబ్బారావు కలిసి బయటకు లాగేస్తారు.)

—o o—

# సంఘం చేసిన భిక్షుకి

## పూర్వ రంగం

ఒకపూవు నేల రాలిపోయె
ఒక కాపురం నేల కూలిపోయె
ఒక బతుకు చితికిపోయె
ఒకతల్లి వీధిపాలైపోయె॥
అన్నీ చూసిన ఇరుగు పొరుగులు
మాకేమంటూ తలుపులు మూసారు
చూడలేని కన్నవారు దూరమయ్యారు.
కూడులేని నీడలేని బికారులే
ఆదరించి సేవతీసారూ॥

వ॥ దీనాతిదీనంగా అలా వీధిలో పడున్న కమల ఏమవుతుందో
మీరే చూడండి.

# సంఘం చేసిన భిక్షుకి

## మూడవ రంగం

స్థలం:- ఇంటి ముందు భాగం

(కమల నేలమీద మూలుగుతూ పడి ఉంటుంది.)

కుంటి గుడ్డి బిచ్చగాళ్ళు అలా వెడుతూ ఉంటారు, మూలుగు వినబడి ఆగుతారు.

గుడ్డి:- సొట్టా: ఎక్కడో మూలుగులాగుంది. కాస్త నిలబడి యిను.

కుంటి:- అవును. నాకూ అలాగే ఇనబడుతోంది.

(అటు ఇటు చూస్తాడు.)

గుడ్డి:- సొట్టా! ఎవరిదంటావు ఆ మూలుగు!

కుంటి:- ఆ ఇంటిముందు ఎవరో కదులుతున్నట్లు కనబడుతున్నారు.

గుడ్డి:- ఎవరో పాపం ఇంత సీకట్లోనే అక్కడెందుకున్నట్లు.

కుంటి:- ఎవడో తాగినాడై ఉంటాడు.

గుడ్డి:- దగ్గరగా పోయి సూద్దాం. అటుకు నడు.

(ఇద్దరు దగ్గరగా వెడతారు.)

కుంటి:- (వంగుని చూస్తుంది.) ఎవరో ఆడకూతుర్లాగుంది. ఈ సీకట్లో పడుందేటి!

కమల:- ఊ.. ఊ-

(మూలుగు కాస్త గట్టిగా వినబడుతుంది.)

కుంటి:- బిడ్డా! ఎందుకు మూలుగుతున్నావు.)

(వంటిమీద చెయ్యివేసి అడుగుతుంది.)

కమల:- నీళ్ళు-మంచినీళ్ళు...

కుంటి:- నీళ్ళు అంటోంది.

గుడ్డి:- సొట్టా మనకాడ ఉన్నాయి కదా! కాస్త తాగించు.

కుంటి:- తాగుబిడ్డా తాగు.

(మెల్లిగా నోట్లో పోస్తుంది.)

(కమల రెండు గుక్కలు తాగుతుంది.)

లేచి కూచో బిడ్డా.

కమల:- (మెల్లిగా లేవబోయి పడిపోతుంది)

కుంటి:- మెల్లిగా కూసోబిడ్డా.

(అనరా ఇచ్చి కూచో పెడుతుంది)

నీళ్ళు తాగుబిడ్డా.

కమల:- (మరి కాసిని నీళ్ళు తాగుతుంది.)

(అటు ఇటు చూస్తుంది తర్వాత వాళ్ళ వైపు చూస్తుంది)

కుంటి:- బిడ్డా! మీ ఇల్లెక్కడ.

కమల:- (తల అడ్డంగా తిప్పుతుంది.)

గుడ్డి:- పోనీ ఎక్కడికి ఎడతావో సెప్పు.

కమల:- (తల అడ్డంగా తిప్పుతుంది.)

కుంటి:- మాటాడు బిడ్డా. గుడ్డికి కనబడదు.

గుడ్డి:- ఏటి అంటోంది బిడ్డ.

కుంటి:- ఏది అడిగినా తల అడ్డంగా తిప్పుతోంది. ఏదో పెద్దింటి బిడ్డ లాగుంది. పాపం. ఎవరో కొట్టి ఇక్కడ పడేసినట్లున్నారు.

గుడ్డి - ఏ దొంగ నచ్చినోళ్ళు ఎత్తుకొచ్చినారో ఏమో!

కుంటి:- పోనీ పోలీసోళ్లకి అప్ప చెబుదామా?

కమల:- ఒద్దు. ఒద్దు నన్ను వాళ్లకి అప్పచెప్పకండి. మీ రెళ్ళిపొండి.

కుంటి:- పోనీలే బిడ్డా! ఈ దెబ్బలేటో కాస్త సెప్పుబిడ్డా!

కమల:- ఏం లేదు. దేవాలయం అనుకుని వధ్యశాలకు వచ్చాను అంతే

గుడ్డి:- సొట్టా! ఆ తల్లిని ఇంకేటి అడగబోకు

కుంటి:- పోనీలే బిడ్డా! ఏదో ఏటి సెప్పొద్దుకాని నువ్వు ఎక్కడికి ఎల్లాలో సెప్పు. అక్కడకు సీ ఎంట వత్తాము.

కమల:- నాకు ఎక్కడికి వెళ్ళాలని లేదు. చచ్చి పోయాననుకున్నాను. ఆయమునికి కూడా నేను బరువయ్యాను. (రెండు చేతులతో మొహం కప్పుకుంటుంది)

కుంటి:- ఎందుకు బాదపడతావు బిడ్డా! మనం ఈ బూమిమీద ఎన్నాళ్లు ఉండాలో ఏరి కెరిక? మనం సేసుకున్న పాపం మనం అనుబ ఏంచాలి. అది పూర్తికాకుండా ఎల్లలేం బిడ్డా. ఆ గుడ్డోడుసూడు నేను సూడు. ఎందుకు బతుకుతున్నామో సెప్పు తల్లీ. ఎలా బతుకుతున్నామో సూడు తల్లీ! ఈ నేలమీద నూకలున్నన్నాళ్ళు బతికుండాలి తప్పదు బిడ్డా!

కమల:- నేను చచ్చిపోవాలి. నేను చచ్చిపోవాలి.

గుడ్డి:- ఎందుకు సచ్చిపోతావు బిడ్డా! ఏదో ఒకనాడు ఎలాగా సచ్చి పోతాం అంతవరకు బతకాలి బిడ్డా!
ఈ లోకంలో ఈ బిచ్చగాళ్ళు ఎవరికీ బారంకారు బిడ్డా! ఏరోజు కారోజు అందరిని అడిగి ఇంత తెచ్చుకుని తింటారు. అదికూడా అందరూ తినగా మిగిలింది. ఏరికి పనికిరాందే బిడ్డా. ఎట్లా రేపటికి మిగుల్చుకోవాలన్న చింతేలేదు బిడ్డా. ఎక్కడో ఇన్ని నీళ్ళు తాగి ఊరు చివర పండుకుంటారు. ఉండాలన్న చింత లేదు బిడ్డా! లేదన్న బెంగాలేదు. లే! బిడ్డా! లే! నీ దెబ్బలకు ఇంత పసరు పెట్టితా లే బిడ్డా! లే!
(కుంటి గుడ్డి లేచి నిలబడతారు)

కుంటి:- లే బిడ్డా లే!

(కమల లేచి నిలబడుతుంది. కుంటి గుడ్డి ఆమెకు అటు ఇటు నిలబడతారు కమల ఆ యింటివైపు చూసి కారె కన్నీళ్లు తుడుచు కుటుంది.)

కుంటి,గుడ్డి: నడు బిడ్డా! నడు.

కమల: (వారి వెంట అడుగులేస్తుంది.)

—: —:

# సంఘం చేసిన ఖైదుకి

## పూర్వరంగం

బంగరు బొమ్మా! కమలమ్మా!
మట్టి బొమ్మగా మారిపోయిందీ:
సంఘంలో బతుక లేనిదై
పిచ్చుకలా ఊరూరా తిరిగిందీ ॥
తిండిలేని నిద్రలేని **కమలమ్మా** !
అనాధలా రోగాల పాలు అయ్యే!
రేగిన ప్రేమ తొందర పెట్టగా
చిన్నబిడ్డను చూడాలని ఆ వూరు చేరిందీ!

వ: అనారోగ్యంతో కొట్టు మిట్లాడుతూ చావు బ్రతుకుల్లో ఉన్న ఆ విచ్చగత్తె ఏమయిందో మీరే చూడండి।

# సంఘం చేసిన భిక్షుకి

## నాల్గవ రంగం

**స్థలం:- ఇంటి ముందు భాగం**

(ఇంటిముందు ఒకపిల్ల కూర్చుని ఉంటుంది. బిచ్చకత్తె నడవ లేక నడవలేక నడుచుకుంటూ వస్తుంది.)

పిల్ల:- బూచి! బూచి!

(భయంతో కేకలు వేస్తుంది.)

(మంగమ్మ ఇవతలకు వస్తుంది.)

మంగ:- ఎందుకే ఏడుస్తున్నావు ఏడుపుగొట్టు మొహమాని. మీ అమ్మతో పాటె నువ్వుకూడా పోయిఉంటే పీడా పోయేది. ఆ దరిద్రపుది పోతూ పోతూ నిన్ను నా మెడకు అంటిగట్టి మరీ పోయిందే!

పిల్ల:- బూచి! బూచి!

మంగ:- ఎక్కడే! మొద్దుమొహమానీ!

**పిల్ల:- అదిగో బూచి!**

(చేత్తో చూపిస్తుంది.)

మంగ:- ఎవత్తివె నువ్వు. పిల్ల భయపడుతూ ఉంటే ఇంకా అక్కడే నిలబడావు. బుద్ధిలేదూ. ఇంకా గుడ్లప్పగించి ఏం చూస్తున్నావు? ఇక్కడ ఏముందనే.

(బిచ్చకత్తెను పరిశీలించి చూస్తుంది.)

నీ చూపుల్లో నిప్పులు పొయ్యా! అలా చూస్తావేమే! అయ్యో అయ్యో! ఎవత్తో పిల్లల్ని ఎత్తుకుపొయ్యేదండోయ్! రండర్రోయ్

(సుబ్బారావు ప్రవేశం.)

సుబ్బా:- ఏమిటమ్మా!

మంగ:- ఏమైందిరా! ఎవత్తో పిల్లల్ని ఎత్తుకుపోడానికి వచ్చిందిరా! నీ పూవుల్లో నిప్పులు పొయ్యా అలా చూస్తావేమే!

సుబ్బా:- పిన్నాదు చెబుతోంటా వెళ్ళవేమే!

(పక్కలనుంచి రాళ్ళు పడతాయి.)

(బిచ్చకత్తె నేలకు వరిగి పోతుంది.)

మంగ:- నిజంగానే చచ్చిపోయినట్లుందిరా! ఎవరైనా చూస్తే మనమీద కేసు పెడతారు. నడు! నడు! లోపలకి వెళ్ళిపోదాం.

(పిల్లను తీసుకుని లోపలికి వెళ్ళిపోతారు.)

(కుంటి గుడ్డి ఆ దారినే వెడుతూ ఆమెను చూస్తారు.)

**కుంటి:- గుడ్డి! ఎవరో పడిపోయి వున్నారు.**

గుడ్డి:- ఎవర్ని సూడు.

(దగ్గరా వెళ్ళి చూస్తాడు.)

కుంటి:- గుడ్డి మన బంగారమ్మరోయ్ మన బిడ్డరోయ్. చచ్చిపోయింది రోయ్.

గుడ్డి: మన బిడ్డేనా! మన బంగారమ్మేనా.

(ఆమెను చెత్తో తడిమి చూసి ఇద్దరూ అక్కడే కూర్చుంటారు.)

కుంటి:- బిడ్డా మేముండగా నువ్వే ఎళ్ళిపోయినావా బిడ్డా! ఎంత పని చేసినావు బిడ్డా.

(గుండెలు బాదుకుంటూ ఏడుస్తారు.)

గుడ్డి:- పొట్టా! బిడ్డను తగలెయ్యాలి కదరా! మన బంగారమ్మ కళేబరాన్ని వదలి ఎట్టా పోతాంరా!

తన భుజంమీద నున్న గుడ్డతీసి కప్పుతాడు.)

కుంటి, గుడ్డి:- అమ్మా! దానం సేయండి. బాబూ దానం సేయండి. ఈ అనాది శవాన్ని బూడిద సెయ్యాలి బాబూ! దానం సెయ్యండి.

అమ్మా! దానం సెయ్యండి. బాబూ! మా బంగారమ్మని బూడిద సెయ్యాలి బాబూ.

సుబ్బా,మంగి:– (బయటకు వస్తారు.)

సుబ్బా:– (పది రూపాయలు. పాతబట్ట ఆమెమీద పడేస్తారు. తిరిగి లోప లకి వెళ్ళిపోతారు.)

కుంటి,గుడ్డి:– అమ్మా దానం చేయండి. బాబూ దానం చేయండి–ఈ బంగారమ్మను బూడిద చెయ్యాలి బాబూ.

---

# యువ గళం

అహింసకు మారుపేరు
గౌతముడూ గాంధీ
పుట్టినా దేశమూ ఇది
దురాచారాలను రూపుమాప
నడుంకట్టిన రామమోహన్‌రాయలు
వీరేశలింగము గురజాడలు
పుట్టిన గడ్డయా ఇదీ–
ఎందరు మహాత్ములు పుట్టినా
ఏమని ఉపదేశించినా
మారవా వనితల బతుకులూ
లేరా: (తాతలు–రారా-ముందుకూ
ఎవరిదీ ఈ తప్పు?
కన్నవారిదా? కట్టుకున్న వారిదా?
సమాజానిదా మీరేచెప్పండి?

సంఘానికి వెరచి సమాజానికి భయపడి
కన్నకూతుళ్ళనే కసాయివారికి
అప్పగించి బాధ్యత తీరందనుకుంటున్నారా
అర్ధాంగివంటూ అనురాగం చిలికించి
కట్నంకోసం కట్టుకున్న భార్యనే
పీకలునులిమి పెంటపాలు చేస్తుంటె
మనకేమిటంటూ మనసును మూసేస్తున్నారా!
తోటి ఆడదని జాలిలేక
చంటిపిల్ల తల్లియని జాలిలేక
ఇంటికోడలినే మట్టిపాలు చేస్తున్న
అత్తల ఆగడాలను చూసి
కళ్ళు మూసుకుని వెళ్ళిపోతున్నారా?
వినండి ఈ కథనూ
చూడండి ఈ కథనూ
కళ్ళు తెరవండి మనసులు విప్పండీ
నడవండీ నడుంకట్టి
వరకట్న పిశాచాన్ని తరిమికొట్టి
రండి రండి కదలిరండి
తల్లుల్లారా! తండ్రుల్లారా!
అన్నల్లారా! అక్కల్లారా!
రండి రండి కదలిరండి
వరకట్న పిశాచాన్ని తరిమికొట్టండి.

సమాప్తం